60th Year of Publication వజ్రోత్సవ సంవత్సరం

# జమీన్ రైతు

ESTD. 1930
Regd No. H. NL.18
సంపుటి: 60 సంచిక: 51
22-12-1989
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూ 1.50

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు * సంపాదకుడు : నెల్లూరు శోభేంద్రప్రసాద్ * మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

## ఎన్టీఆర్‌లో ఏమాత్రం మార్పు లేదు!

రాష్ట్ర రాజకీయాలు, భిన్న ధృవాలంటంది నాయకులిద్దరి మధ్య పడి నలిగి పోతున్నాయి ఇటు ఎన్టీఆర్, అటు చెన్నారెడ్డి ఇద్దరూ ప్రత్యేక తరహాకు చెందిన నాయకులు. ఒక్క అహంకారంలో తప్ప మరే విషయంలోనూ ఇద్దరికీ సామ్యంలేదు. ఇద్దరూ చెరొక పార్టీకి సారథులు. రాష్ట్రంలో ప్రజలను ప్రభావితం చేయగల పార్టీలు ఇవి రెండే కావడంతో, ఏ రాజకీయమైనా వారిచుట్టే గిరికీలు కొడుతుంది. అయితే పదేళ్ళ అరణ్యవాసం తర్వాత ముఖ్యమంత్రి అయిన చెన్నారెడ్డి కాని, హఠాత్తుగా మాజీ అయిపోయిన ఎన్ టి రామారావు కాని తమ ప్రవర్తనలో ఏమాత్రం మార్పు ప్రదర్శించలేక పోతున్నారు. రెండు పార్టీల కార్యకర్తలు, నాయకులకు ఈ వైఖరి ఎక్కడలేని చికాకు కల్గిస్తున్నది.

అధికారం కోల్పోయినా ఎన్ టి రామారావులో అణుమాత్రం మార్పులేదు; వచ్చే అవకాశంకూడా కన్పించడంలేదు. తాను ఏలుతున్నంత కాలం తెలుగు ప్రజలు తనను తప్ప మరెవ్వరినీ గద్దెనెక్కించరనే ఆత్మ విశ్వాసంతో వుండిన ఆయనకు, ఆరే తెలుగు ప్రజలు దిమ్మతిరిగే గుణపాఠం చెప్పారు. ఎన్నికల ఫలితాలు వెలువడగానే 27, 28 తేదుల రెండురోజులూ ఆయన ఇంట్లోనుంచి బయటకు రాలేదు. పసిపిల్లవాడివలె ఏడ్చారని అంతరంగికులు చెప్తారు. నేషనల్ కాన్ఫరెన్స్ సమావేశానికి ఢిల్లీకి వెళ్లివచ్చేడుకూడా ఆయన కళ్ళు చెమ్మగిల్లే కన్పించాయి.

**★ హైదరాబాదు వార్తా కథనం ★**

అయితే ఈ అనుభవం నుంచి ఎన్ టి రామారావు ఏమాత్రం పాఠం నేర్చుకున్నట్లే కన్పడటంలేదు. ఆయనలో ఏ మాత్రం మార్పురాలేదు. అదే అల్లుళ్ళ పెత్తనం, అదే అహంకారం, అదే వైఖరి. ఎన్నికల తర్వాత జరిగిన సమీక్షా సమావేశంలోనేకాదు, ఆ తర్వాత తనను కలవ వచ్చిన జిల్లా నాయకులతోకూడా దానింకా "ముఖ్యమంత్రి"వనే ధోరణిలోనే ప్రవర్తిస్తున్నాడాయన. అంతర్గత ప్రజాస్వామ్యానికి, దిగువశ్రేణి నాయకుల మాటకు విలువ ఇవ్వవలసిన అవసరాన్ని ఆయన ఇంకా గుర్తించినట్లు కన్పడడం లేదు. ఆత్మవిమర్శ, ఆత్మ పరిశీలనా, రెండూలేవు. పార్టీని నడిపించే బాధ్యతను అల్లుళ్ళిద్దరు, పాత పద్ధతిలోనే నిర్వహిస్తున్నారు.

తెలుగుదేశం టిక్కెట్ పై గెల్చిన ఎమ్మెల్యేలు పలువురు ఎన్ టి ఆర్ ను కలిసి, పార్టీలో చేపట్టవలసిన మార్పు చేర్పులను సూచిస్తే, ఆయన విన్పించుకోలేదట. పైగా ఓటమికి జిల్లా నాయకుల అసమర్థతే కారణమని నిందించాడట. ఏ జిల్లాలోనైనా స్థానిక నాయకత్వాన్ని ఎదగనిచ్చివుంటేకదా, ఇప్పుడు తప్పు వారిపై పెట్టడానికి అని తెలుగుదేశం వాదులు తమలో తాము ఆక్రోశిస్తున్నారు. కానీ వారిగోడు విన్పించుకునేవారులేరు. అప్పటికీ కొందరు ఎమ్మెల్యేలు ధైర్యం చేసి, ఎన్ టి ఆర్ ను కలిసి, తెలుగుదేశం పార్టీని ఇప్పటికైనా రాజకీయపార్టీగా నడిపించాలని, ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగా వ్యవహరిస్తే ఎప్పటికీ ప్రజలకు దగ్గర కాలేమనిచెప్తే, ఆయన వారిపై ఆకాశమంత ఎత్తున ఎగిరిపడ్డాడట.

వెనుకబడిన కులాలకు చెందినవారు, ఉద్యోగులు, యువకులు పూర్తిగా పార్టీకి దూరమైపోయినందువల్లే ఈ ఓటమి పరాభవం సిద్ధించిందనే నిజాన్ని అలస్యంగానైనా తెలుగుదేశం అధినాయకులు గుర్తించారు. కాంగ్రెస్ పార్టీకి, తమకు మధ్య సీట్లసంఖ్యలో చాలా అపరిమితమైనప్పటికీ, ఓట్ల సంఖ్య మాత్రం చాలా తక్కువనే విషయం వీరికి ధైర్యం కల్గిస్తున్నది.

ఆ ధైర్యంతోనే ఎన్టీ ఆర్ రాష్ట్రంలో ఐదేళ్ళ తర్వాత రానున్న ఎన్నికలలో తమదే విజయమన్న విశ్వాసం ప్రకటించారు. ఆమాత్రం ఆశ వుండడంలో తప్పు లేదు. అయితే ఐదేళ్ళతర్వాతైనా ప్రజాభిమానాన్ని తిరిగిపొందడానికి చేసినతప్పులు తిరిగి చేయకుండా వుండాలన్న వాస్త

—కొరవ 8 వ పేజీలో



## కేంద్ర సమాచారానికి రెండవ తెలుగు మంత్రి పర్వతనేని ఉపేంద్ర

రాష్ట్రంలో తెలుగుదేశంపార్టీ పతనమైపోయినా, కేంద్రంలో తెలుగువారి ప్రతినిధిగా శ్రీ పర్వతనేని ఉపేంద్ర సమున్నత స్థానం అలంకరించారు. సమాచారమంత్రిగా ఆయన నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వంలో కీలకమైన పదవినే సంపాదించారు. మన రాష్ట్రంనుంచి పదుల సంఖ్యలో నాయకులు కేంద్ర మంత్రిత్వాలు నిర్వహించినప్పటికీ, సమాచారశాఖను చేపట్టిన రెండవ తెలుగు వ్యక్తి శ్రీ ఉపేంద్ర. అంతకు క్రితం జవహర్‌లాల్ నెహ్రూ మంత్రివర్గంలో శ్రీ

—కొరవ 8 వ పేజీలో

# పినాకిని తీరం

## జెట్ స్పీడులో జె. కె.!

నెల్లూరు తిరుగులేని కాంగ్రెస్ శాసన సభ్యుడు శ్రీ జె. కె. రెడ్డి స్పీడు, జెట్ విమానవేగాన్ని మించిపోయింది. పూజలు, వార్షికోత్సవ వివాహ సన్మానాలే; ఫర్నిచర్ షాపు ప్రారంభోత్సవాలే; పేరంటాళ్ళు, పరప్రసాదాలే! ఒక్క క్షణం తీరికున్నట్లులేదు; రెండుకాళ్ళు ఒకచోట పెడుతున్నట్లులేదు. పేరుకు నెల్లూరు శాసన సభ్యుడేగాని, జిల్లా అంతటినీ అమాంతం కౌగలించుకుంటున్నారు. అయన శంకుస్థాపనలు చేస్తూ, అయిన్ని కౌగలించుకుంటున్నారు జనం! ఇటువంటివారి వెన్నెంటికైనా అట్టుకో గలిగిన తురుపుముక్క, దాకక్కం ఆయన కున్నాయి. రంగంలో జిల్లారాజకీయాల్లో గ్లామరస్టార్ ఎవరంటే జె కె నే! మరోమాట లేదు, మరోమనిషి లేరు!

జె. కె. పీద ఎందుకింత మోజు? ఆయన నుండి ఏమి ఆశించి ఈ మన్నన? చూస్తుంటే విచిత్రంగానే వుంది. మొన్న ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి కావలి పర్యటనకు వచ్చినపుడు జె. కె. మంది మార్బలంతో పది కార్లతో దండెత్తి హోరు పుట్టించారట. కావలి గెస్ట్‌హౌస్ దగ్గరకుపోతే జనమంతా మంత్రులు మహామంత్రులను వదలి ఈయన్ను చుట్టుముట్టారట; ఆనందాతిశయంతో పైకెత్తి కుదేశారట; పాపం ఒళ్ళు హూనమైవుంటుంది! ఇటువంటి ప్రమళివాన మాలలను ఎన్నికలప్పటి నుండి తిని తిని జె కె శరీరం గట్టిపడిపోయి వుంటుందనుకోండి! కావలిలో ప్రజలుచూపిన ఆదరణాభిమానాన్ని అయన తనపై వుంచుకోలేదు; పత్రికలో అక్కడికక్కడే వాగ్దానరూపంలో చెల్లించివేశారు — తుఫాను బాధితుల సహాయార్థం ఆయన యాభైవేల రూపాయల విరాళాన్ని ప్రకటించారు! నిజమో కాదో కలుదోగాని, కావలి శాసనసభ్యుడు కూడా అంతటి అనపెద్ది జె కె ను కౌగలించుకున్నారన్నారు! జె కె మోజు స్థానిక శాసనసభ్యులకు కూడా బెదరగా వుంది. నెల్లూరు టౌనులో జిల్లాలోని నలుగురైదుగురు శాసనసభ్యులు కాపురమున్నారు. టవున్లో సన్మాన సందర్భాలంటే జె. కె. నొక్కడినే పిలుస్తున్నారు కాని, మర్యాదకైనా మరొకరిని అహ్వానించటంలేదు. అదే ఇతర నియోజకవర్గాలలో ఆ శాసనసభ్యునితోబాటు జె.కె.నికూడా ఊరేగిస్తున్నారు, కలిసేసి పంపుతున్నారు. పాపం, మన శ్రీ సి. వి. శేషారెడ్డి తన నియోజకవర్గంలోని ఒక సన్మాన సభలో తాను తోడు పెళ్ళికొడుకునని చెప్పుకోవలసి వచ్చిందట! జె. కె. జిల్లానంతా కౌగలించుకుంటున్నారన్నానే — ఇటువంటి వార్తలు వినబడుతున్నందువల్లే! కాంగ్రెస్ అభ్యర్థిగా గెల్చినందుకే జె. కె. ఇంతెంతగా సుఖూయిందేవాడోగదా అనిపిస్తుంది!

నూతనోత్సాహంలో జె. కె. వాగ్దానాల వెల్లువ ఎక్కువగానేవున్నట్లుంది. ఎవరేమి అడిగినా లేదు కాదు అనేమాటేలేదు, చేస్తానననే వరుస! జిల్లాకు పొట్టిశ్రీరాములు పేరు పెడ్తానన్నారు; నెల్లూరుకు మెడికల్ కాలేజి తెస్తానన్నారు; స్థలం ఇస్తే ఇందుకూరుపేటలో జూలో జూనియర్ కాలేజి తెరుచుకోవడం తధ్యమన్నారు. ఇక చిన్న చితక వాగ్దానాలకు లెక్కేలేకపోయింది. ఒక్క జె కె కు సంబంధించేకాదు, కొత్తగా శాసనసభ్యులైన వారందరూ ఈ విధంగా వాగ్దానాల వర్షంగా పారేయకతప్పదు. లేకుంటే విన్న ఓటు వేసినవారు రేపు మొహంచూడారు.

ఎవరైనా ఎన్నికైన క్రొత్తలో, మొదలవుతాయి పూలమాలల బరువులు, సన్మాన సత్కారాలు. విందుల వినోదాల గిరిగి తలలో పైనుడస్తాడు; అడిగింది అక్కడికక్కడే ప్రసాదిస్తారు! ఈ సందడంతా అణగి, పూహాలోకం నుండి వాస్తవ జగత్తులోకి వచ్చి, కండ్లు నులుముకొని ఇట్లా తెరిచేసరికి దూరిన అర్థాల వాగ్దానాల బరువు బాధ్యతలు తెలిసి వస్తాయి. చెప్పడం సులభంగాని చెయ్యడం దుస్సాధ్యం అనే నిజం క్రమంగా అనుభవానికి వస్తుంది. ఒక్కోసారి శాసన సభ్యులకుకాదుగదా, మంత్రులకే చిన్న పనులు సానుకూలంగావు! రెండుసార్లు వరుసగా శాసనసభ్యుడుగావున్న వ్యక్తి పీద ప్రజల మోజు పోతున్నదంటే, మూడవసారి గెలవడం దాదాపు కష్టం అట్టడుగోయినట్లవుతున్నదంటే, ప్రజల కోర్కెలన్నీ తీర్చలేకపోవడమే కారణం. నెల్లూరులో శ్రీ కె. వి. సుబ్బారెడ్డి ఓడిపోవడం, ఆత్మకూరులో డాక్టర్ సుందర రామిరెడ్డి లక్కీరాన్పుగా గెలవడం ఇందుకు తాజా నిదర్శనాలు.

పనులుచేయలేక పోవడమేకాదు, ఎల్లకాలం సౌందర్యపు రాజకీయాలలో వెచ్చించలేరు. రెండూ జరగనప్పుడు దశ వెనక్కు తిరుగుతుంది. మొదటికి తిరుగులేనటులో అఖండవిజయం పొందడంద్వారా జె. కె. జిల్లాలో సంచలనాన్ని కల్గించారు; గ్లామరస్ రాజకీయవాది అయ్యారు. స్పీడు తగ్గించుకొని, వరాల ప్రదానం పరిమిత పరచుకొని, చేయగలిగినవి చెప్పి, చెప్పినవిచేసి, ప్రజల ఆశాభంగానికి ఆస్కారం లేకుండా, తోటి రాజకీయవాదుల అసంతృప్తి అసూయలకు అవకాశమివ్వకుండా వచ్చిన గ్లామర్‌ను ఎక్కువకాలం నిలుపుకోవడం వాంఛనీయం. కాదా జె. కె.?



వర్ధంతి సందర్భంలో 15వతేది మూలపేటలోని పొట్టిశ్రీరాములు విగ్రహంవద్ద: ఎడమవైపు పి. సి. రెడ్డి, శాసనసభ్యుడు జె కె. రెడ్డి, కలెక్టరు కె. రాజు, కుడివైపు — తుమ్మల రామప్రసాదరెడ్డి, వావిళ్ళ సుబ్రహ్మణ్యం.

## ఇది నిజమా?

అదృష్టవంతుణ్ణి చెడచెలేరు, దురదృష్టవంతుణ్ణి బాగుచేయలేరు అంటారు. విశ్వ సత్యమైన నానుడి ఇది. కాకుంటే రాజకీయ అస్త్రసన్యాసం పుచ్చుకొని ఇంట్లో విశ్రాంతి తీసుకొంటుండిన డాక్టర్ చెన్నారెడ్డిని రాజీవ్‌గాంధీపిలిచి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షత అప్పగించడమేమిటి, ఆరు మాసాలు తిరగకముందే అనుకోకుండా ఎన్నికలొచ్చి నెత్తిన బడడమేమిటి, అప్పటికే ఏర్పడివుండిన అనుకూల వాతావరణం వల్ల అనూహ్యంగా కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూరడమేమిటి, గతంలో మన రాష్ట్రంలో ఎన్నడూలేని విధంగా చెన్నారెడ్డిగారు రెండవసారి ముఖ్యమంత్రి కావడమేమిటి — చెన్నారెడ్డి అదృష్టపు సుడి ప్రభావం కాదంటారా?

చెన్నారెడ్డి అదృష్టవంతుడే గాని, ఆయన పేరు చెప్పేప్పటికల్లా అపోహలు, అపనిందలు కూడా ప్రారంభమవుతాయి. టిక్కెట్ల పంపకంలో పెద్ద తారుమారుచేసి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు అవినీతికి పాల్పడ్డారని అప్పుడే పుకార్లువ్యాపించాయి. తారుమారుచేశాడోలేదో, టిక్కెట్లు అమ్ముకున్నాడోలేదో భగవంతునికి తెలియాలి

-కొరవ 10వ పేజీలో

# జమాఖర్చు

## వాగ్దానాల సింగ్

వి పి సింగ్‌ను వాగ్దానాల సింగ్ అనో, వాగ్దానవరుసల సింగ్ అనో పిలవాల్సినట్లుంది. పదవిలో కుర్చీ పట్టుమని పదిరోజులు గడవక ముందే ఆయన దేశ ప్రజలపై కురిపిస్తున్న వాగ్దానాల కుంభవృష్టి చూస్తుంటే కొత్త మోజుతో వళ్ళు మర్చిపోతున్నారా, ఉత్సాహంలో విహరిస్తున్నారా అన్పిస్తున్నది.

ఢిల్లీ ప్రభుత్వం చేసిన వాగ్దాన పరంపరలో రైతుల అప్పుల రద్దు, రేడియో, టి వి లకు స్వయం ప్రతిపత్తి ప్రధానమైనవి.

పదివేలకు లోపల దేశంలో రైతులకున్న అప్పులన్నింటినీ రద్దు చేస్తామని ప్రకటించారు వి పి సింగ్; ఆయన ఆర్థిక మంత్రి ప్రొఫెసర్ మధుదండావతే, దీనివల్ల ప్రభుత్వంపైనపడే భారం 14వేల కోట్లని లెక్కగట్టారు. కొన్ని లక్షలమంది రైతులు వ్యక్తిగతంగా లాభపడబోతున్నారనే సంతోషం ఒకప్రక్క కల్గుతున్నప్పటికీ, ఈ దాతృత్వం వాంఛనీయమా అన్న సందేహం ఇంకొక ప్రక్క పీకుతున్నది. 14 వేల కోట్లనేది నిస్సందేహంగా చాలా పెద్దమొత్తం; కేంద్ర ప్రభుత్వమైనా భరించ శక్యంకాని పద్దు. మైనారిటీలో వున్న తమ ప్రభుత్వానికి ప్రజల మద్దతు సంపాదించడంకోసం వి పి సింగ్ ఈ జనాకర్షక పథకం చేపట్టున్నారు. ఎన్నికల ప్రణాళికలో ఈ అంశం చేర్చినందువల్లే తాము గెల్చామన్నది వారి భ్రమగా వున్నట్లుంది. ఎన్నికల హామీలు తీర్చడంలో తప్పులేదుకాని, ఎన్నికలలో అటువంటి హామీలు ఇవ్వడమే ప్రమాదకరమైన విషయం.

ఈ అప్పుల రద్దువల్ల గ్రామీణ ప్రాంతాలలోని బ్యాంకింగ్ వ్యవస్థ స్తంభించిపోతుంది. గ్రామీణ బ్యాంకులు తాంబైతాతం పంట రుణాలు పదివేలకు మించి ఇవ్వవు. అవి రద్దయిపోతే, వారికి ఆర్థిక కార్యకలాపమే వుండదు. ప్రభుత్వ వాగ్దానం ఆచరణలోకి వచ్చేటప్పటికి, కనీసం ఏడాది పడుతుంది. అంతకాలం రైతులకు కొత్తఅప్పులు పుట్టవు. దేశ ఆర్థిక వ్యవస్థపైకూడా దీని ప్రభావం ద్రవ్యోల్బణం రూపంలో అతి ప్రమాదకరంగా పడుతుంది.

అప్పులరద్దువల్ల రైతుకు తాత్కాలికంగా ప్రయోజనం కల్గవచ్చుగాని, దీర్ఘకాలంలో నష్టపోయేదే ఎక్కువగా వుంటుంది. ఇదే పద్నాలుగువేల కోట్లు నీటి పారుదల, విద్యుత్‌వంటి ప్రాజెక్టులపై వెచ్చిస్తే వాటి ఫలితాన్ని రైతాంగం తరాలతరబడి అనుభవిస్తుందికదా! ఇంతడబ్బే కేంద్రంలోవుంటే, గంగ కావేరి లింక్ ప్రాజెక్టును చేపట్టి దేశంలో కరువు, వరదలు రెండింటినికూడా పూర్తిగా నివారించవచ్చు. దానివల్ల కల్గే లాభం లక్షల కోట్లలో వుంటుంది.

టి. వి., రేడియోలకు స్వయం ప్రతిపత్తి అన్నది మంచి ప్రతిపాదన. ప్రచార సాధనాలపై ప్రభుత్వ ఆదుపువల్ల, ప్రజలు నిష్పక్షపాత వార్తలను తెలుసుకునే అవకాశం కోల్పోతారు. అందులో ఈరోజు దేశంలోని వార్తా రంగంలో టి వి, రేడియోల ప్రాధాన్యత అపరిమితం. పత్రికలు చొరలేని ప్రదేశాలలోకూడా ఇవి చొచ్చుకునిపోయి, ప్రజలకు విశ్వసనీయమైన సమాచార సాధనాలౌతున్నాయి. ఈ పరిస్థితులలో టి వి, రేడియోలు స్వయం ప్రతిపత్తికల సంస్థలుగా రూపొందితే దేశ ప్రజలందరూ హర్షిస్తారు. అయితే ఈ సంస్థ నిర్మాణం ఎంతో మెళకువతో, అన్ని కోణాలనుంచి పరిశీలించి, సమగ్ర అధ్యయనంచేసి జరపాలి. ఏదో చేయాలనే తొందరలో హడావుడి ప్రదర్శిస్తే అసంకల్పపు మౌలిక లక్ష్యమే దెబ్బతినిపోయే ప్రమాదంవుంది.

ప్రధానమంత్రిపై వచ్చే అవినీతి ఆరోపణలను సైతం విచారించే అధికారంగల లోక్‌పాల్ వ్యవస్థ రూపకల్పన వి పి సింగ్ తలపెడుతున్న మరొక ఆదర్శప్రాయమైన సంకల్పం. ప్రధానిగా, పార్టీ పిరాయింపుల వంటి ఎన్నో మంచి పథకాలు అమలుచేసిన శ్రీ రాజీవ్ గాంధీ ఈ బిల్లును చట్టం చేయలేకపోయారెందువల్లనో! ఆచరణసాధ్యం కాని వాగ్దానాలుకూడా వి పి సింగ్ లెక్కకు మించి చేస్తున్నారు. భూసంస్కరణలు, దున్నేవారికే భూమి వంటివే కావు- పంజాబ్, శ్రీలంక, జమ్మూ కాశ్మీర్ సమస్యలను సైతం క్షణాల్లో పరిష్కరించి వేయగలమన్న ధోరణిలో మాట్లాడుతున్నారు వి పి సింగ్. మొండికెత్తినవంటి, దశాబ్దాలకరబడి కొరుకుడుపడని సమస్యలను రాత్రికిరాత్రి మాయం చేయడానికి ఆయనేమీ మాంత్రికుడు కాదుకదా! కొత్త మోజులో నేలవిడిచిన సాముచేయకుండా, జనాకర్షక పథకాలతో ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేయకుండా ఆచరణ సాధ్యమయ్యే వాగ్దానాలను మాత్రమేచెప్పి, చేయగల్గితేనే వి పి సింగ్ ప్రభుత్వం రాణింపుకు వస్తుంది.

# జమాఖర్చు

22-12-1989

16 పేజీలు ఆడా

### కాంగ్రేసుభవనం

స్థలంకొన్న తర్వాత యింకా పూర్తిగా యివ్వలేదు శ్రీ గోపాలరెడ్డిగారు జిల్లాకు వుండగానే యీ కార్యనిర్వహణం పూర్తిచేయిస్తే మంచిది.

స్థలంకొన్న తర్వాతైనా, శ్రీకృష్ణరావు పంతులు ఢంకా యివ్వడా అని అడగవచ్చునా?

### కాంచనమాలధర

ఈ వారంలో కాంచనమాల (సినీ నటి) ధర 12 నుండి 15 వేలకు పెరిగినదని తెలుస్తూంది. ఇంతకుమించి యీ బొమ్మను ఆంధ్ర మార్కెటు భరించలేదు. ధర పెట్టదము లో తమిళ మార్కెట్ ఎంతకైనా సిద్ధం! వాళ్ళ చేతుల్లోకి పోతుందేమో యీ తార?

### 7 1/2 లక్షలు

నెల్లూరు జిల్లా నుండి యిప్పటికి ఫిలిం వ్యాపారం మీద పెట్టింది కాని, పెట్టబోయ్యేదికాని మనూరు 7½ లక్షలు కదా! 5 లక్షల పెట్టుబడితో వైవి రావుగారి క్రిందకట్టడ పెటి క్రింద ఒక ఫిలిం కంపెనీ స్థాపించి, స్టుడియో కట్టించి ప్రతిభగల ఫిలిం మాదిరి ఫిలిం నిర్మాణానికి పూనుకొంటే వరుసగా ఫిలిములు తీయవచ్చునే, ఎందుకు ప్రయత్నించకూడదు దశభ్యుగారూ?

ఈ జిల్లాలో ధనముంది. పూనుకొనే పెద్దలున్నారు. నిర్వహించే తంతాయలున్నవి. యిక "మూర్ఛకాడొంకటి కావలెగాక".

### పైరునాటుటకోయంత్రం

రైతులు చేతితోనాటుజరుపుటవలన ఆలస్యమగుటయేగాక నారు దెబ్బతినుచున్నదిగావున గంటలో యెకరా ప్రదేశము నాటు యంత్రమును అమెరికా రైతులుపయోగించుచున్నారట. ఒకే విధముగా నాటును యీ యంత్రము జరుపును. పంట హెచ్చుగుచున్నదట.

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

### జనసంఖ్య—పశుసంఖ్య

ఇండియాలోని పశువులు జనం ఒకరొకరితో పోటీచేసుకుంటున్నారు. పశువుల మొత్తం 815 మిలియనులు; అంటే జనసంఖ్యకన్నా 16 మిలియనులు తక్కువన్నమాట.

### ధనవంతులు ధర్మకర్తలే

గాంధీజీ వ్యాసం

అనేకమంది ధనికులు నేనంటే స్నేహభావంతోవున్నారనిగాని, వర్కన్నా చూస్తే భయపడుచున్నారను విషయంగాని నాకు తెలియకపోలేదు. నేను అందుకు మాత్రం సిగ్గుపడుటలేదు. కాని కమ్యూనిస్టులు, సోషలిస్టులు ధనస్వామ్యమును నిర్మూలింప దలచుకున్నారో, అవిధముగ కాకపోయినను ఇంచుమించుగ వారి కోరికప్రకారమే నేనుగూడ ధనస్వామ్యమును నిర్మూలింప గోరుచున్నానని వారికి బాగుగనే తెలియును. నాకును, వారికిని పద్ధతుల లోను మాటలలోను మాత్రమే భేదం. ధనవంతులు తమవద్దనుండే ధనానికి స్వంతదారులుకారు. కేవలంధర్మకర్తలం వంటివారు. నేను తెలుపుచుండే సిద్ధాంతము కేవలం తాత్కాలికంగా తప్పించుకొనుటకు చెప్పేదికాదు. పైకి భ్రమింప చేయడానికి చెప్పే పైపూత మాటలు కావు. అది వేదాంత సూత్రములందును, మతసిద్ధాంతములందును ప్రతిపాదింపబడిన ధర్మనిర్వచనము.

తనుక సోషలిస్టులను, వామపక్షీయులను కార్యాచరణకు సమయము వచ్చినప్పుడు నాకేమాత్రము అర్థుగనిలువరు. నా పద్ధతులు విజయవంతములగుటలో అనాథలను, పేదలను సౌఖ్య జీవనులగుదురని వారికి బాగుగ తెలియును. ★

# పేదరికమే రిజర్వేషన్లకు ప్రాతిపదిక కావాలి!

కులం ప్రాతిపదికగా రిజర్వేషన్లకు వ్యతిరేకంగా బీహారు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో విద్యార్థులు ప్రారంభించిన ఉద్యమం రోజురోజుకీ తీవ్రతరమౌతూ, అమంటలు ఇతరరాష్ట్రాలకుకూడా ఎక్కడ వ్యాపిస్తాయోనని ఆందోళన కలుగుతున్నది. ఇదివరకు గుజరాత్‌లో ననుకుంటాను, రిజర్వేషన్ల వ్యతిరేకోద్యమం ఆ రాష్ట్రాన్ని సంక్షుభితంపాల్జేసింది.

రిజర్వేషన్లకు సంబంధించినవి రెండు సమస్యలు. ఒకటి పార్లమెంటు, శాసనసభలకు సంబంధించిన రిజర్వేషన్లు; రెండవది కాలేజీలలో, ఉద్యోగాలలో రిజర్వేషన్లు. మొదటి రిజర్వేషన్ల పొడిగింపు గడువు జనవరికి పూర్తి అవుతుంది; అందువల్లనే జనతాదళ్ ప్రభుత్వం శాసనసభల్లో షెడ్యూల్డుతెగల, షెడ్యూలుకులాల వారికి సీట్ల రిజర్వేషను మరో పదేళ్ళు పొడిగిస్తూ రాజ్యాంగ సవరణను చేయబోతున్నది. దాన్ని ఏపార్టీ వ్యతిరేకించదు కాబట్టి పొడిగింపు ఆమోదం పొందుతుంది. పొడిగింపబడే పదేళ్ళతో కలిసి మొత్తం స్వాతంత్ర్యానంతరం యాభై ఏళ్ళపాటు హరిజన గిరిజనాది వర్గాలవారికి రిజర్వేషన్ల సౌకర్యం కల్గించినట్లవుతుంది. ఇక ఎన్ని దశాబ్దాల పొడిగింపు జరిగితే వారు సంఘంలో సమానస్థాయికి వస్తారనేది వూహించలేని విషయం. ఎన్నిదశాబ్దాలు బడ్డినా ఈ విషయంలో ఎవ్వరికీ ఆక్షేపణ లేదు, వ్యతిరేకత లేదు.

కాని చదువులు, ఉద్యోగాలలో రిజర్వేషన్లకు సంబంధించే ఇతర వర్గాలవారిలో తీవ్రమైన అలజడి, ఆందోళనలు




వున్నాయి. విద్యార్థులు, విద్యావంతులైన యువకులహృదయాలు అగ్నిపర్వతాలవలె కుతకుత వుడికిపోతున్నాయి. తెలివున్నా విద్యావకాశాలు లేకుండాపోతున్నాయని మెరిట్‌వున్నా నిరుద్యోగులుగా వీధులంట తిరగవలసివస్తున్నదని వారు బాధపడిపోతున్నారు. తమకంటే తక్కువ మార్కులు వచ్చినవారు ఇంజనీరింగు, మెడిసిన్‌వంటికోర్సులలో సీట్లుపొందడంవల్లనూ, వచ్చే తాము పొందలేకపోవడం; వున్నతమైన అర్హతలున్నా తాము వుద్యోగాలకు అనర్హులుకావడం, తక్కువఅర్హతగలవారు సులభంగా వుద్యోగాలు పొందడం యువకులను దహించివేస్తున్నది. కూటికి జరగని నిరుపేదలమైనా, కులం 'అగ్ర'కావడంతో తాము అన్యాయానికి గురైపోతున్నామని వారు వ్యధితులవుతున్నారు. చదువులు, వుద్యోగాలలో రిజర్వేషన్లకు ప్రాతిపదిక ఆర్థికస్థితిగా వుండాలగాని, కులం కాదని వారు అభిప్రాయపడుతున్నారు. ఈ రిజర్వేషన్ల సమస్య విద్యార్థులు యువకులేకాదు, వారి తల్లిదండ్రులలోకూడా తీవ్రమైన అలజడిని రేకెత్తిస్తున్నది. హరిజన గిరిజనాది సాంఘికంగాకూడా వెనుకబడిన వారికి సదుపాయాలు కల్గిస్తున్నందుకు ఎవ్వరూ అసూయపడడంలేదు; పేదవారమైన తమకు వారితో సమానంగా విద్య వుద్యోగాలలో సదుపాయాలు కావాలనేది వారి వాదం.

ఈ వాదంలోని సమంజసత్వాన్ని రాజకీయ నాయకులందరూ అంగీకరిస్తారు; క్రియవరకు వచ్చేసరికి విస్సహాయులవుతారు! అందువల్లనే తరచు విద్యార్థుల ఆందోళనలుపక్రమించి అవి హింసాత్మకంగా పరిణమిస్తున్నాయి. ఉత్తరరాష్ట్రా

—తరువాయి 10వ పేజీలో

# అందరికీ ఆదేశాలివ్వను ఎవరు అధికారమిచ్చారు?

ప్రజావిజ్ఞప్తుల దినమనబడే ప్రహసనం 20 తేది నిజా వృగా జరిగిపోయింది. ఉదయం 7 గంటలనుంచి రాత్రి 11 గంటలవరకు ఇటు అధికారులు, అటు అమాయక ప్రజల రాజకీయనాయకుల బలవర్ప ప్రదర్శనలో 'పూర్తి'గా మారిపోయారు. వివిధ సమస్యలపై ప్రజలనుంచి పిటిషన్లు స్వీకరించి, వాటిపై తక్షణ చర్యకు అధికార్లను ఆదేశించడం ఈ కార్యక్రమ లక్ష్యం. 6089 మంది అమాయక ప్రజలు విజ్ఞప్తుల దినంలో తమ అర్జీ ఇస్తే, సమస్యలు చిటికెలో పరిష్కారమైపోతాయనే భ్రమతో ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. దాదాపు వందమంది జిల్లా అధికార్లు పర్నా ఉగ్గ గంటలపాటు తిండి నీళ్ళు లేకుండా, చలికి గజగజ వణుకుతూ, మర మనుషుల వలె పనిచేశారు.

ఈ రాజకీయ యజ్ఞానికి పోమగుండం కలెక్టరేట్ ఆవరణలో ఏర్పాటైంది. కూలగొట్టిన పంచాయతి ఆఫీసు స్థలంలో రాష్ట్ర రవ్వలు ఏరి, 60 షామియానాలు వేసి, కౌంటర్లు, స్టేజీ ఏర్పాటుచేశారు; మైకులు బిగించారు. విచిత్రమేమిటంటే, ఇదంతా అనధికారయుతంగా, అధికార్లు తమ జేబులోనుంచి ఖర్చుతో చేసిన ఏర్పాట్లట. అధికారయుతంగా ఈ ప్రహసనం జరప దానికి రూల్సు ఒప్పుకోవట. జిల్లా అధికార్లకు దాదాపు 20 వేల రూపాయల చేతి చిలుము వదిలిందని అంచనా: ఈ 20 వేలు వారు తిరిగి ఎక్కడినుంచి జమకట్టుకోవాలి: ప్రజలనుంచేనని ప్రత్యేకంగా చెప్పాలా!

మొదట, వచ్చిన అర్జీని 'రిసెప్షన్ కౌంటర్'లో పరిశీలించి, అది ఏశాఖకు చెందిందో వ్రాశారు; ఆ తర్వాత ఆ చీటి పట్టుకొని సంబంధిత అధికారిదగ్గరకు వెళ్ళితే-ఆ పనిచేయదగిందో కాదో వ్రాసి

> **ప్రజా విజ్ఞప్తుల దినంతో ఆరువేల మంది ప్రజలను అమాయకులను చేసి సాగనంపారు శ్రీనివాసులురెడ్డి!**

మంత్రిదగ్గరకు పంపారు; మంత్రిగారు మైకులో అధికార్లకు ఆదేశాలు ఇచ్చారు. మధ్యమధ్యలో సారాయి వేలంపాటల్లోవలె అప్పటివరకు వచ్చిన పిటిషన్ల సంఖ్యను మైకులో ప్రకటిస్తుండినారు. ఉదయం 7.30 నుంచి రాత్రి 10.30 వరకు విరామంలేకుండా సాగిందీతంతు. రోడ్లమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారు, కలెక్టర్ శ్రీ కె. రాజా, ఇతర అధికార్లు, ఉద్యోగులు అంతసేపూ కదలకుండా కూర్చున్నారు. మంత్రిగారికి మాత్రం మధ్యమధ్యకు ఖర్జూరపండ్లు, సీమ జీడిపప్పు, గజనిమ్మకాయ రసం అందుతుండినాయి; అధికార్లకు మాత్రం కడుపు మాడిపోయింది. వారికి అన్నంపెట్టినవాడు లేడు, పోయి తినిరమ్మనిచెప్పినవారూలేరు.

వచ్చిన దరఖాస్తులలో అధికభాగం ఇళ్ళు, ఇళ్ళస్థలాలకు సంబంధించినవే! తరువాత రేషన్‌కార్డుల అర్జీలు ఎక్కువగానే వచ్చాయి. ఒక్క నెల్లూరు అర్బన్ దేనికొచ్చిన అర్జీల సంఖ్య 2858. ఇన్ని వేలమంది ఎంతోదూరంనుండి పనీ పాటా మానుకుని, ఎంతో ఆశతో, తమ సమస్యలు పరిష్కారమైపోతాయనే విశ్వాసంతో వచ్చి అన్ని గంటలసేపు నిరీక్షిస్తే, వారికి జరిగిన మేలు శూన్యం.

వచ్చిన అర్జీలపై మంత్రికాని, అధికారులుకాని చేసిన నిర్ణయాలు వింటే కడుపు మండిపోతుంది. టౌన్‌లో ఇళ్ళ స్థలాలడిగినవారి పేర్లను "రిజిష్టర్‌లో నమోదు" చేసిపెట్టమన్నారు మంత్రిగారు. నెల్లూరులో ఇళ్ళస్థలాల రిజిష్టర్‌లో ఇప్పటికే 15 వేల పేర్లు నమోదై వున్నాయి. వీరికి స్థలాలివ్వడానికి కనీసం పదేళ్ళు పడుతుందని అంచనా. అదనంగా ఇప్పుడు చేరినవారు మరొక పదేళ్ళు నిరీక్షించాలి

-తరువాయి 6 వ పేజీలో

# జిల్లాలో తెలుగుదేశం ఒక పార్టీగా మనగలుగుతుందా?

జిల్లాలో తెలుగుదేశం ఒక రాజకీయ పార్టీగా మనగలుగుతుందా? పార్టీలోని ముఖ్యులలో ఎందరు పార్టీని వదలకుండా వుండగలుగుతారు? తెలుగుదేశం భవిష్యత్తేమిటి?

జిల్లాలోని పదకొండు స్థానాలను కాంగ్రెస్ హిందడం, రాష్ట్రంలో కాంగ్రెసే అధికారానికిరావడం... దీనితో జిల్లాతెలుగుదేశం నాయకులలో పెక్కుమంది ఆలోచనలో పడ్డారు. ఐదేళ్ళు అజ్ఞాతవాసం గడపడమా? మరేదైనా దారి చూసుకోవడమా? అనే సందిగ్ధంలోవున్నారు. తెలుగుదేశం ఒక రాజకీయపార్టీకాదు; దానికి సిద్ధాంతాలు గిద్ధాంతాలులేవు; ఎన్. టి. రామారావుతప్ప దానికి మరో నాయకుడు లేడు. ఆయనే తెలుగుదేశం; తెలుగుదేశమే ఆయన. ఆయనతోనే వచ్చిన ఆపార్టీ ఆయనతోనే అంతమవుతుంది. ఐదేళ్ళలో కాంగ్రెస్ ప్రభుత్వం పడిపోయే ప్రశ్న లేదు. ఐదేళ్ళఅనంతరం తెలుగుదేశం అధికారానికి వచ్చే అవకాశంలేదు. ఈ సత్యం పార్టీలోని ప్రతిఒక్కరికీ తెలుసు. అందువల్ల ఐదేళ్ళతర్వాత కొత్తగా దారివెతుక్కొనేబదులు, ఇప్పుడే ఒకనిర్ణయం తీసుకొని ఈ ఐదేళ్ళలో పొరబడిపోవటం మంచిదిగదా అనే తలంపువుంది. ఎన్నికద్వారా పదవులకు వచ్చినవారు వారు ఆ పదవిని కోల్పోవలిస్తేతప్ప, పార్టీ మారడానికిలేదు. అటువంటివారు పదవుల్లో, పార్టీలోవుంటూనే లోపాయికారీ రాజకీయసంబంధాలు నెరపుకోవాలి. పదవులులేని తెలుగుదేశీయులకు అటువంటి ప్రతిబంధకాలేమీలేవు; వారు బహిరంగంగానే ఏమైనా చేయవచ్చు.

కాంగ్రెస్‌లో అవకాశాలులేక, పదవుల కోసం తెలుగుదేశం పార్టీలో చేరినవారే ఎక్కువ; పార్టీమీద, దాని నాయకత్వం మీద, దాని విధానాలమీద విశ్వాసముండి చేరినవారు తక్కువ. తెలుగుదేశంమీద అభిమానంవుండి, దానిలో కొనసాగదలు

> **పార్టీనాయకులు కాంగ్రెస్ వర్గాలకు అనుబంధితులౌతారా?**

కున్న వారికికూడా రామారావు వైఖరిపట్ల తీవ్రమైన విముఖత ఏర్పడింది. తెలుగుదేశం విధానాలు ఏవైనా, రామారావుగారి ధోరణి ఎటువంటిదైనా సహించి అందులోనే వుండిపోయేవారు కొందరున్నారు. కాని అనేక కారణాలతో అవకాశవాదంగా చేరినవారే ఎక్కువమంది. అటువంటి వారిలోమార్పు అనివార్యం.

జిల్లాలో తెలుగుదేశం నాయకులెవరు? అధినాయకుడు రామారావుగారికి ఎవరిమీద

—తరువాయి 6 వ పేజీలో

# సాయినాథన్ & కంపెనీ స్వర్ణోత్సవ సందర్భంగా

# ఇవే మా హార్దికాభినందనలు



నెల్లూరు పట్టణంలో 50 సంవత్సరాల క్రితం శ్రీ ప్రత్తి నరసింహులుశెట్టి గారు స్థాపించిన సాయినాథన్ అండ్ కంపెనీ దినదినాభివృద్ధి చెందుతూ నెల్లూరుజిల్లాలో ఎలక్ట్రికల్స్ అండ్ ఎలక్ట్రానిక్స్ అమ్మకాలు మరియు షో రూంలో తలమానికంగా తయారయి

## 24-12-89 తేది ఆదివారం స్వర్ణోత్సవం

జరుపుకోవడం ఆనందదాయకం. ఇదేవిధంగా సాయినాథన్ & కంపెనీ కలకాలం అభివృద్ధి చెందాలని ఆశిస్తున్నాము.

ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్
ఆర్ ఆర్ స్ట్రీట్, నెల్లూరు. ఫోన్ 8493

టి టి కృష్ణమాచారి & కో
Prestige Cookers
హైదరాబాద్.

పి. రామయ్య ఆడిటర్
రంగనాయకులపేట, నెల్లూరు.

చైతన్య జ్యూయలరీ ఎస
ప్రొ: సోమిరెడ్డి చిన్నకాశయ్య,
చిన్నబజారు, నెల్లూరు. ఫోన్ 8518.

**Kokila Financiers**
16/1059, Pogathota,
Nellore.

బి. దశరధరామిరెడ్డి B.E.,
కాంట్రాక్టర్స్, నెల్లూరు.

**R. K. Electronics**
Distributors: Dynora,
Vediocon.
Near Corporation Bank
Trunk Road, Nellore.

కలవకూరు ప్రభాకరరెడ్డి
మున్సిపల్ కౌన్సిలర్,
నెల్లూరు ఫోన్ 7904 పిపి.

యం. రవీంద్రనాథ్ రెడ్డి
3/687, లక్ష్మీపురం, నెల్లూరు.

శ్రీ షిర్డిసాయిబాబా హీరో ఏజెన్సీస్
ప్రొ: రమణయ్య,
ట్రంకురోడ్ - నెల్లూరు.

వెంకటేశ్వర ఏజెన్సీస్
స్టాకిస్టు: ఎవరెస్టు సిమెంటు రేకులు
వర్తి పర్తిభాకర్
సంతపేట, నెల్లూరు.

మోహినీ స్టోర్స్
పట్టుచీరల ప్రత్యేక షోరూం,
ట్రంకురోడ్, నెల్లూరు.

బి. గంగాధర్ రెడ్డి
శ్రీ వెంకటరమణ ఎంటర్ ప్రైజెస్,
శ్రీవారి కాలనీ, పొగతోట, నెల్లూరు.

**Babu & Babu Agencies**
Prop. : D. C. Hari Babu,
Autoxerox,
Jonnalagaddavari Street,
Nellore.

ఫోన్ 6840
ఎంబేటి రమణయ్యలారీ ఓనర్
నెల్లూరు జిల్లా, హరిజనసంక్షేమ
సంఘ అధ్యక్షులు,
స్టోన్‌హవున్ పేట, నెల్లూరు.

హరితా ఎలక్ట్రానిక్స్
ప్రొ: వై వి ఎన్ స్వామి
A P Distributors
Seoda TV Boosters &
Stabilisers
Mfg TV Antennas,
పప్పులవీధి, నెల్లూరు

మాధవయ్య సన్స్ & కంపెనీ
ప్లైవుడ్ & ఫర్నిచర్స్
జొన్నలగడ్డవారివీధి
నెల్లూరు

కె.వి. చలమయ్య & సన్స్
హార్డ్‌వేర్ & పెయింట్స్
సంతపేట : నెల్లూరు

ఫోన్ : 6860
రాయవరపు శంకరయ్య & సన్స్ సిల్క్స్ & శారీస్
ట్రంకురోడ్డు, నెల్లూరు

ఫోన్ : 5785
కాశి సిల్క్ హౌస్
ప్రొ॥ సోమిశెట్టి కాశయ్య
అధ్యక్షులు: నెల్లూరుజిల్లా ఆర్యవైశ్యసంఘం
ఆరావీధి : నెల్లూరు

PH : 3898, 5956
**R. K. AGENCIES**
Distributor for
G. D. Naidu French Polish
Santhapet : Nellore

శుభాకాంక్షలతో

యం. డి. సందానిబాషా
నెల్లూరు టౌన్ ప్లానింగ్ కమిటీ ఛైర్మన్
జెండావీధి - నెల్లూరు

Ph : 5428
**STEREO SOUNDS**
Pro : P. Anjaneyulu
Trunk Road : Nellore
CROWN T V
Authorised Dealer

Ph ; 7716
Dr. B. Ramakrishna reddy
Children Specialist
Near Madras Bus Stand
Nellore

బిందు మెడికల్స్
ప్రొ॥ ఎస్. వెంకటేశ్వర్లుగుప్త
రైల్వేఫీడర్స్ రోడ్ - నెల్లూరు

వి. ఎస్. ఆర్.
మెడికల్ ఏజన్సీ
హోల్‌సేల్ మెడికల్ డిస్ట్రిబ్యూటర్స్,
దేవిరెడ్డివారివీధి,
ట్రంకురోడ్డు - నెల్లూరు

**BHARAT WINES**
15/168, Brindavanam,
NELLORE - Ph : 3292

ప్రజా షూ కంపెని
ట్రంకురోడ్డు - నెల్లూరు.

మోడరన్ షూ మార్ట్
ట్రంకురోడ్డు - నెల్లూరు

SIVANADHA & COMPANY
Electricals & Electronics
14/446, Trunk Road,
NELLORE Ph : 3792

ఫోన్ : 6114
జి. వి. ఆర్. ఆయిల్ మిల్స్
యన్. రమణయ్య
నెల్లూరు ఆయిల్ మిల్లర్స్ అసోసియేషన్,
నవాబుపేట : నెల్లూరు

రాజీ అడ్వర్‌టైజర్స్
C/o. అలంకార్ ఫ్యాన్సీస్,
మూలాపేట - నెల్లూరు. ఫోన్ : 4110

**Mungamoor Gopi Reddy**
Devakinandhan
Real Estates
Civil Engineering
Contractors
Balaganapathi
Arrack Syndicate
NELLORE

ముంగమూరు
శ్రీధరకృష్ణారెడ్డి
కౌన్సిలర్,
విజయగోపాలపురం, నెల్లూరు.

కామాక్షి స్టీల్స్
హోల్‌సేల్ ఐరన్ & సిమెంట్ & కాంట్రాక్టర్స్
ట్రంకురోడ్డు, నెల్లూరు.
ఫోన్: ఆఫీసు : 7687, 6675,
ఇల్లు : 5727, 5809.

కామిశెట్టి వెంకటకృష్ణారావు
S/o. ఆదిశేషయ్య
మేనేజింగ్ డైరక్టర్
శ్రీ సాయికృష్ణ ఆగ్రోమిల్స్ ప్రై. లి.
నవాబుపేట, నెల్లూరు.

**Vina Electronics**
Authoroised Dealers for
Nelco : Murphy : Beltek
16/1087, C. Trunk Road
NELLORE

సౌభాగ్య ఎంటర్‌ప్రైజెస్
Mg.Pr K V Ramana Reddy
స్టోన్‌హవున్‌పేట, నెల్లూరు.

మదీనావాచ్ కంపెనీ
Allwyn, HMT, Titan
Agency
టౌన్‌హాలు ఎదురు ట్రంకురోడ్ నెల్లూరు.

**Sri Krishna Pipe Traders**
Prop. K. Govinda Rao
15/503, R. R. Street
NELLORE



'బాలనాగమ్మ'లో ప్రమీల

# తెలుగు నేలపై మళ్లీ బాలమురళి మధుర గానం!

రాష్ట్రంలో ఎన్. టి. రామారావు ప్రభుత్వం అధికారంలో వున్నంతవరకు ఆంధ్రప్రదేశ్‌లో గానం చేయనని ప్రతిజ్ఞ పూనిన మంగళంపల్లి బాలమురళీకృష్ణ కీర్తనలు ఇప్పుడు ఆంధ్ర శ్రోతలకు వినిపించే భాగ్యాన్ని కల్గిస్తానని రాజమండ్రి నుంచి పార్లమెంటుకు ఎన్నికైన సినిమా నటి జమున ఇటీవల తెలిపారు. కళాకారులకు సకలసౌకర్యాలనూ కలుగజేసే విషయమై రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డితో సంప్రదిస్తాననికూడా చెప్పారామె

## మద్రాసు సినిమా వార్తలు

### కృష్ణాయుధం

మన నిర్మాతలు సమయోచితంగా చిత్రాల పేర్లను పెడుతుంటారు. కృష్ణ నటించే ఒక చిత్రంపేరు "ఆయుధం" ఇందులో ఆయన కలెక్టరు. ఆయనకొడుకు రమేష్‌బాబు రౌడీ. రాధ, బాబీవిశ్వనాధ్, శివకృష్ణ, సత్యనారాయణ, వేలు, పి. ఎల్. నారాయణ, బాలామోహన్, సంజీవి, వినోద్, సాయికుమార్, మాడా, ప్రసన్న కుమార్, అనూరాధ ఇతరపాత్రధారులు. నిర్మాత జి. సత్యనారాయణ. దర్శకత్వం కె. మురళీమోహనరావు. ఇది నేటి అబ్కారీ వ్యవస్థమీద అల్లబడినకథ. దేశవ్యాప్తంగా నేడు అబ్కారీ వ్యాపారస్థులు ఓ సిండికేటుగా ఏర్పడి ఎంతగా డామినేట్ చేస్తున్నారో చెప్పేచిత్రం.

### విశ్వనాథ్ కొత్తచిత్రం

మన సంప్రదాయాలను పోషిస్తూ, చక్కని సంగీత నృత్యప్రధాన చిత్రాలను రూపొందిస్తూ, అడుగడుగునా మన తెలుగుదనం కొట్టొచ్చినట్లు కనిపిస్తూంటుంది గనుకనే కె. విశ్వనాథ్ చిత్రాం కోసం మన ప్రేక్షకులు ఎంతో ఆత్రుతతో ఎదురుచూస్తుంటారు. ఈయన కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్వేత ఆర్ట్ థియేటర్స్‌వారు కొత్తచిత్రాన్ని ప్రారంభించారు. ఇందులో ప్రముఖ నాట్యాచార్యుడు కళాకృష్ణ కథానాయకుడు. మాధవీలాం, మాణిక్యభారతి అనే ఇద్దరు కొత్త అమ్మాయిలు నాయికలు. ఇంకా చంద్రమోహన్, సాక్షి రంగారావు, మిశ్రో, కళ, రత్నసాగర్, నవభారత్ బాలాజీ,

—తరువాయి 11వ పేజీలో

# అన్న ఇచ్చిన రాయితీలు చెన్నారెడ్డి రద్దుచేస్తాడనే భయం

కొందరు నిర్మాతలు అన్నీ సిద్ధంచేసుకుని కూడా కొత్త చిత్రాన్ని ప్రారంభించడానికి తటపటాయిస్తున్నారు. శ్లాబ్‌విధానం ఉంటుందో- ఉండదో! చలనచిత్రరంగంలో తెలుగుదేశ ప్రభుత్వం ప్రవేశ పెట్టిన కొన్ని రాయితీలను చెన్నారెడ్డి ప్రభుత్వం తొలగిస్తుందేమో! ప్రభుత్వం మారినప్పుడల్లా పాలసీలు మారడం సహజమే. సినిమాటోగ్రఫీశాఖ ముఖ్యమంత్రి ఆధీనంలోనే వుంది. నూతనప్రభుత్వం ఎలాంటి నిర్ణయాలు తీసుకుంటుందోనని ఎదురు చూస్తున్నారు. ఎన్. టి. ఆర్. వ్యక్తిగత వ్యవహారసరళిలో వేసిన మరికొన్ని తప్పటడుగులు ఇటీవల బయటపడినవి. "బ్రహ్మర్షి విశ్వామిత్ర" రికార్డింగ్ సమయంలో కొన్ని రూల్సు మార్చి, పాటలను బొంబాయిలో రికార్డు చేయించారు. మామూలుగా ఏ స్టూడియోకైనా 25 లక్షల వరకే ఋణం మంజూరవ్వాలి. కాని, సవరించిన రూల్సుతో నాచారంలో కట్టిన రామకృష్ణ హార్టి కల్చరల్ స్టూడియోస్‌కి ఓసారి 25 లక్షలు, మరోసారి 50 లక్షలు మొన్న సెప్టెంబర్‌లోనే మంజూరుచేయడం జరిగింది. ఈ విషయం డాక్టర్‌సాబ్ దృష్టికి వచ్చివుంటుంది. ఆయన ఏచర్యలు తీసుకుంటారో తెలియకపోదు.

### నరేష్ పునర్వివాహం

నటుడు నరేష్ తన మొదటి భార్యకు విడాకులిచ్చేసి, ప్రముఖ కవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మనుమరాలు, సుప్రసిద్ధ చిత్రకారుడు బుజ్జాయి ద్వితీయకుమార్తె రేఖను డిసెంబరు 18న వివాహమాడారు.

ఆధ్యాత్మిక సందేశామృతాన్ని ఆకర్షణీయంగా అందించిన చిత్రం

# అయ్యప్పస్వామి మహాత్మ్యం

## చిత్ర సమీక్ష

గిద్దలూరు గోపాలరావు

కొంతకాలంగా మన ప్రాంతంలో అయ్యప్పస్వామిపేరు భగవద్భక్తికి మారుపేరుగా ప్రసిద్ధికెక్కింది. స్వామిపేరు ముక్తిప్రదాయకమైన రసగుళికగా, తక్షణ కైవల్య ప్రాప్తికి వెలుగుబాటగా ప్రచారం పొందింది. ఇందుగలడందులేడని, అన్న సందేహము వదలి దైవభక్తి తన్మయత్వంలో ఆంధ్రభూమిలో ఎంతో మంది భక్తులు తమగుండెల్లో శబరిమలై దేవాలయం నిర్మించుకొని స్వామిని దీక్షతో ఆరాధిస్తున్నారు. మాలధారులైన అయ్యప్పస్వామి భక్తులశరణఘోష ఆంధ్రభూమి నలుదిశలా కొసలవరకు వ్యాపించింది. "ఓం! ఓం! అయ్యప్పా! ఓంకారరూపా అయ్యప్పా! స్వామియే అయ్యప్పా! శరణం శరణం అయ్యప్పా"- అని స్వామిని స్మరిస్తూ మనుష్యుల్ని దైవత్వంతో పులకింప జేస్తూ అసంఖ్యాకంగా భక్తులు శబరిమలై యాత్ర సాగిస్తున్నారు.

దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు, ధర్మసంస్థాపనకు శ్రీమన్నారాయణుడుధరించిన అనేక అవతారాల్లో అయ్యప్పస్వామి అవతారమొకటి. దేవతలను బాధిస్తున్న "మహిషి" అనేరాక్షసిని అంతమొందించేందుకు శివుని నృత్యకేళిలో జగన్మోహిని పొందిన బిడ్డ అయ్యప్పస్వామి. ఇతని మొదటిపేరు మణికంఠుడు. జగన్మోహిని ఈ బిడ్డను అడవిలో వదిలేస్తుంది. ఈబిడ్డ పడాందేశ రాజు పోషణలో పెరుగుతాడు. "మహిషిని" మర్ధించి కారణజన్ముడవుతాడు. రామావతారంలో తనకు నమ్మినబంటుగావున్న హనుమంతుడు తపస్సు చేస్తూవుండటం గుర్తించి అతనికి మోక్షం కలిగిస్తాడు. అలాగే శబరికికూడా మోక్షం ప్రాప్తింపజేస్తాడు. తనదేవాలయంనిర్మించబోయే స్థలానికి శబరిపేరు పెట్టాడు. అలా స్వామివున్న దేవాలయం "శబరిమలై" అయింది. తాను తపస్సుకు వెళ్ళేప్పుడు తనను పెంచిన పడాందేశరాజు "అయ్యా" అని, రాజు భార్య "అప్పా" అని తనను సంబోధిస్తారు. పెంచిన తల్లిదండ్రుల జ్ఞాపకార్థం తాను ఆ రోజు నుంచి "అయ్య అప్ప" గా పేరు మార్చుకుంటాడు. శబరిమలై లో వెలుస్తాడు. అలా ఆ కారణజన్ముడు దైవాంశసంభూతుడవుతాడు.

శబరిమలైకి ఆంధ్రభూమికి చిరకాల పరిచయముంది. అయ్యప్పస్వామి అసలు తల్లిదండ్రులైన జగన్మోహిని, శివుల దేవాలయం తూర్పుగోదావరిజిల్లాలో వుంది.

—తరువాయి 11వ పేజీలో

## త్రిపుటనాపూర్వక శ్రీ త్యాగరాజ స్మరణోత్సవ సభ

16-2-1990 నుండి జరగబోవు శ్రీ త్యాగరాజ ఉత్సవములకొరకు 16.12.89 న నగర సంకీర్తనలో ఉత్సవ ప్రారంభింపబడినది.

వై. వి. శాస్త్రి,
కార్యదర్శి.

# ఆత్రేయ

(4వ పేజీ తరువాయి)

మరొక దౌర్భల్యాన్ని కలిగిస్తున్నాయి. పన్నిరేళ్లు హృదయం ద్రవింపజేయ దమే కాకుండా ఉత్తేజాన్నిస్తాయి. దీనిలోని ఇతివృత్తం ప్రపంచంలో యుద్ధాలు ఎందుకు వస్తాయనే విషయంమీద చర్చించిన తర్వాత యుద్ధంవల్ల జరిగేనష్టాలు, ప్రజల బాధలు చూపడం. నాటకంలో అంతర్నాటకం కూడా వుంది. దీని ఉద్దేశ్యం కథానాయకుడు యుద్ధభీభత్సాన్ని ప్రజలం మనస్సుకు హత్తుకొనేటట్లు చూపి కత్తులు పట్టమనుకున్న ప్రజల మనస్సును తన వైపు తిప్పుకొని ప్రయోజనం పొందడం.

స్కూలు మేష్టారు యుద్ధాన్నిగూర్చి కాంపోజిషన్ రాసుకురమ్మన్నారన్న చిన్న పిల్ల సమత, పన్నెండేళ్ళ అమ్మాయి తనతల్లి భూదేవిని వ్యాసం చెప్పమని అడగడంతో ప్రారంభమైన ఈ నాటకం యుద్ధాలు ఎందుకు వస్తాయనే విషయంమీద క్రమక్రమంగా సమాధానంపొందుపరుస్తూ ఆత్రేయగారు తన రచనద్వారా సంభాషణలలో సహజత్వంవల్ల ప్రేక్షకులను ముగ్ధులనుచేస్తారు.

సమత మాటల్లోని హావభావాలు ఆనందాన్ని కలిగిస్తాయి.

ఈ నాటకంలోని పాత్రలలో సిపాయి లాల 'అమరయ్య' ఒకటి. "ప్రపంచంలో దేశదేశాలు తిరిగివచ్చిన అమరయ్య మానవ జాతి సహజత్వాన్నిగూర్చి చెబుతూ మనుష్యులందరూ ఒకటే అని...అన్ని దేశాల్లో చూదాను. అందరూ మనలాగానే నవ్వుతాడు, ఏడుస్తాడు, మనలాగేతింటాడు. అందరికీ సుఖం, దుఃఖం, ఆకలీ అన్నీ ఒకటే అందరికీ ప్రాణంఅంటే తీపివుంది. కూడూ గుడ్డా అందరికీ కావాలి. రంగులు తేడా, మాటలుతేడా, ఆచారాలు అలవాట్లు తేడా" అని అంటాడు.

ఇందు భూదేవి కొడుకులు 'పెద్దాడు', 'చిన్నాడు' అని వున్నారు. వీరిద్దరూ ఉత్తరదక్షిణ ధ్రువాలు. ఈరెండుపాత్రలు నాటకం ఆసాంతం "రెండు సిద్ధాంతాల సంఘర్షణ"గా కొనసాగుతూంటుంది. పెద్దాడు యుద్ధం కావాలంటాడు.చిన్నాడు అతడికి పక్కలో బల్లెంలా వుంటాడు. పెద్దాడు యుద్ధాన్ని ఎందుకు కోరుకుంటాడంటే..."మనది వటిష్ఠదేశం. కాకుండే మనం యుద్ధాన్ని అవకాశంగా తీసుకొని మనదేశాన్ని ఆర్థికంగా బలపరచుకోవాలి. ప్రపంచ వ్యాపారంలో మనమూ ఒక స్థానాన్ని పొందాలి" అంటాడు తల్లి భూదేవితో ఒకచోట.

సామ్యవాద భావాలుగల చిన్నోడు ఒకచోట "పశువు తన కడుపు నిండిన తర్వాతైనా ఇతర పశువుని తిననిస్తుంది. మానవుడు అదీచేయలేడు. ఇంకొకడి ఆకలితోతనకడుపు నింపుకొంటున్నాడు' అని అంటాడు.

ఈ నాటకంలో "స్వాములవారు" భూమిక వుంది. దీనిలో శ్రీశ్రీ 'సందేహ సంశయం' లోని ఆధ్యాత్మికవాది గోచరిస్తాడు. ఈ స్వాములవారు ఒకచోట యుద్ధాన్నిగురించి ప్రస్తావిస్తూ "అదంతా మాయ! వచ్చేదాన్ని ఎవ్వరూ ఆపలేరు. రానిదాన్ని ఎవ్వరూ రప్పించలేరు. ఆపటానికి, రప్పించటానికి మనెవ్వరం! దేవుడు కేవలం నిమిత్తమాత్రులం. వచ్చేదెటూ వస్తుంది, రానిదెటూ రాదు" అంటాడు.

'శాస్త్రి' పాత్ర మరొకటి. ఇతను సైంటిస్టు. పెట్టుబడిదారులకు విజ్ఞానశాస్త్రం ఏలా ఉపయోగపడుతున్నదీ ఈ పాత్ర ద్వారా ఆత్రేయ చాలాచక్కగా వ్యక్తం చేశారు.

మరొక పాత్ర 'మేష్టారు'. స్కూలు రిటైర్మెంటుకి వ్యక్తిచెప్పి గ్రామపెత్తందార్లకు తొత్తుగాండేస్తూ కాలంగడిపే పాత్ర యిది. యుద్ధాన్ని గురించిన చర్చలో ఇతడు ఒకచోట "మాటోటివాళ్ళకు యుద్ధమైనా శాంతయినా ఒకటే. యుద్ధంవల్ల ఒరిగేదీ లేదూ, శాంతివచ్చి సింహాసనం ఎక్కేదీ లేదు" అని అంటాడు. అలాగే మరొకచోట "వ్యక్తిత్వం వెంగజెట్టాలనుకున్న వాడెవరూ తిన్నగా బతకలేడు తెలుసా" అని అంటాడు.

విశ్వశాంతి నాటకంలో పెద్దాడికి ప్రజలకు వైరుధ్యం ఉంటుంది. అనకట్ట కట్టాలనుకొన్న ప్రాంతంలో ఫ్యాక్టరీ కట్టాలనుకోవడంతో వైరుధ్యం తారాస్థాయికి చేరుకుంటుంది. రైతులు ఫ్యాక్టరీ వద్దని తిరుగుబాటుచేస్తారు. ఈ సందర్భంలో శాస్త్రి (సైంటిస్టు) ఒక ప్లానువేస్తారు. "అరలి-ఆశ-ఇవి రెండే మానవజీవితాన్ని నడుపుతున్న శక్తులు. ఈ ముక్కు ద్రాక్షరు ఎంతటి వాళ్లయినా లొంగుతారు" అంటూ పెద్దాడికి ఒక సలహా యిస్తాడు. "వెంటనే ధాన్యంధర పెంచండి ఆకాశ్డీఅమ్మేస్తారు. స్టాక్ చేయండి. ఇక ఉన్న పైరులూ చాలా సులభంగా నాశనం చెయ్యొచ్చు. ఫలితం-కరువు, కాటకం. ఎంతకాలం ఆగుతారు-దిగుతారు-దప్పినట్లు మన కాళ్ళ దగ్గరకు వస్తారు" అని.

రెండో అంకంలో కరువు, కాటకం తాండవిస్తుంది.

మూడో అంకంలో శాంతి కోసం పరితపించే తల్లి భూదేవితో దెయ్యాలు వేదాలు వల్లించినట్లు పెద్దాడు అన్న మాటలు చూడండి "...మనూళ్ళో మన ఫ్యాక్టరీలో మన జనం తయారుచేసింది (అందమైన పింగాణి సామాగ్రిచూపుతూ)...రైతుల దగ్గర భూమిలాక్కొని నేనేంబావుకొన్నానో ఆలోచించండి. ఈ సామాన్లు పరదేశాలకు వెళ్తే మనదేశం ఆర్థికంగా ఎంత అభివృద్ధి చెందుతుందో మనకెంత గౌరవం ఏర్పడుతుందో మీరిప్పుడూహించుకోలేరు"

ఈ నాటకంలో స్త్రీ పాత్రలలో 'శాంతి' ఒకటి. ఈమె శాస్త్రి కూతురు. ఆడుగడుగునా తండ్రి పద్ధతులను ప్రతిఘటిస్తూంటుంది. కథానాయకుడు విశ్వం (చిన్నాడు) ను ప్రేమిస్తుంది. ఎప్పుడూ వాళ్ళింటిలోనే ఉంటూ సమతతో కలిసి ఉంటూ భూదేవి ఆశయాలకు అనుగుణంగా నడుచుకొంటుంది అంతర్నాటకంలో శాంతి 'జేవీ' గాను చిన్నాడు 'జాక్' గాను నటించి ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని చేస్తారు.

★

## పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

గాని, జాబితాలోని అభ్యర్థులందరూ దాదాపు గెల్చితీరుతున్నారుగదా!

అది అభ్యర్థిత్వాల నిర్ణయ దశకు సంబంధించిన అధ్యాయం. రెండవ అధ్యాయం—పార్టీ అభ్యర్థులకు ఏ ఐ సి సి యిచ్చిననిధులు కండ్లుతిరిగేట్టుగావున్నాయి. పార్లమెంటుకు పన్నెండని, శాసనసభకు మూడని వదంతి. అంతంత మొత్తాలు పార్టీ యిచ్చిందంటే నేనునమ్మలేకున్నాను. ఇచ్చివుంటే మాత్రం అభ్యర్థులకు మంచి వెసులుబాటు గలిగివుంటుంది. అందులో పార్లమెంటు రిజర్వుడు అభ్యర్థులకు, కొందరు శాసనసభ అభ్యర్థులకు తరువాత ఖర్చులకు కొంత మిగిలివుంటుందిగూడా!

ఇంతకూ చెప్పవచ్చేదేమంటే మన జిల్లాకు సంబంధమున్న ఒక పార్లమెంటు సభ్యునికి పార్టీ యిచ్చిన నిధి తిరిగి ప్రజ

చాలాగా గాంధీ భవన్ జేరుకున్నదంటారు ఇతరకొత్తపాపు. స్థితిమంతులైన అభ్యర్థులకు యిచ్చిన నిధులు తిరిగివారానే "సద్వినియోగ"మైనాయని ఒక గాలివార్త. మరొక విశేషమేమంటే జిల్లా మంత్రులిద్దరూ తమకాదను కుంటున్న ఒక యువకుడు స్వంతపార్టీయ త్నంతో అభ్యర్థిత్వాన్ని ఖరీదుచేసుకున్నాడని ఇష్టాగోష్ఠి సంభాషణల్లో అనుకోవడం వినబడింది. అంటే రాజకీయాంలో కొత్త అనుకోవలసిన ఆ యువకుడు అనుభవజ్ఞులైన మంత్రులిద్దరి చెవుల్లో పూవిపోయే కాదన్నమాట!

నిజంగాని, నీలి వదంతులుగాని, ఇటువంటివి వింటుంటే ఇదా మన కాంగ్రెసు, వీరా మన నాయకులనే విరక్తిభావం కలుగుతుంటాది. లక్షలు లక్షలు వెదజల్లగలిగిన వారిదే ప్రజాస్వామ్యం అయితే, అటువంటి ప్రజాస్వామ్యం సామాన్యుడికెందుకు!

మాపత్రిక వ్యాఖ్యలు కాంగ్రెస్ వ్యవస్థను అప్రతిష్టపాల్జేస్తున్నాయని కాంగ్రెస్ అభిమాని శ్రీ యేటూరు రామానుజస్వామి ఆవేదన వ్యక్తంచేస్తూ, మామీద ఆక్రోసు వెళ్ళగ్రక్కుతున్నారు. పార్టీ క్రమశిక్షణకు, ప్రతిష్ఠకు భంగకరమని కాంగ్రెస్ వాదులు నోరు మూసుకోబట్టే ఆనాడు రాష్ట్రంలో, ఈనాడు కేంద్రంలో కాంగ్రెస్ పతనమైంది. అంతేకాదు, కాంగ్రెస్‌వాదుల బానిస మనస్తత్వంవల్ల, సంస్థ అవకాశవాదులు,పదవీ వ్యామోహపరుల మయమైపోయి ప్రతిష్టను కోల్పోతున్నది. పెక్కుమందివలె ఈ పోకడతో రాజీపడడం చేతకావడంలేదు. కొత్తగా నేర్చుకోవాలం. ప్రయత్నిస్తాం!

## జనవాణి

(8వ పేజీ తరువాయి)

లలో ప్రారంభమైన రిజర్వేషన్ల వ్యతిరేక ఉద్యమం దక్షిణ రాష్ట్రాలకు ఎగబ్రాకక ముందే, ఈ విషయంలో ఆయా ప్రభుత్వాలు ఆందోళనలకు ఆస్కారంలేకుండా సముచితమైన చర్యలు తీసుకోవాలని కోరుతున్నాము.

నెల్లూరు —ఒక పేదవిద్యార్థి

### పటాలను తొలగించండి

'అన్న'గారికి స్వప్రచార వున్మాదం తలకెక్కి పత్రికలో బొమ్మలద్వారా, కార్యాలయాల్లో పటాలు అలంకరింపజేయడంద్వారా తన 'కల్ట్'ను సృష్టించి రాష్ట్రంలో తనంతటివాడులేడనిపించుకొని, ఆ బలంతో ఆంజనేయుడిలాగా కేంద్రంలోకి లంఘించాలని కలలు గని బోర్ల పడ్డారు. దానితో రాష్ట్రానికిపట్టిన గ్రహణం వదలిపోయింది. కాని ఆయన సృష్టించిన కటౌట్ల సంస్కృతికి స్వస్తిజరగాలంటే, ముఖ్యంగా ఆఫీసుల్లో, స్కూళ్ళలో వ్రేలాడుతున్న రామారావుగారి బొమ్మలు తొలగించాలి

పూర్వం జాతిపిత మహాత్మాగాంధీ, రాష్ట్రపతి, ప్రధాని బొమ్మలతప్ప ముఖ్యమంత్రి బొమ్మ ఏ ఆఫీసులోనూ వుండేది కాదు. ఈ సాంప్రదాయం రామారావుగారు ప్రవేశపెట్టిందే. కాంగ్రెస్ ముఖ్యమంత్రులు అటువంటి దాపలాన్ని కొనసాగించరాదని నా ఆకాంక్ష.

రేణిగుంట —కె. వరదరాజులు

### ప్రజలకు కావలసింది తప్పులపట్టిక కాదు!

తెలుగుదేశం ప్రభుత్వం గత ఏడేళ్ళలో చేసిన తప్పులపై ఒక శ్వేతపత్రం ప్రయాడపేసి దేశమంతటా పంపకం చేస్తా

మని ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ప్రకటించారు. కాని ప్రస్తుతం ప్రజలు కోరుతున్నది తప్పుల పట్టికలుకాదు. మొన్నటి ఎన్నికలలో కాంగ్రెస్‌పైన నేషనల్ ఫ్రంటు, రాష్ట్రంలో తెలుగుదేశంపైన కాంగ్రెసు పరస్పరం చేసుకున్న ఆరోపణలు, విమర్శలు ప్రజల చెవుల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. అటువంటివెవ్వరు మళ్ళీ శ్వేతపత్రాలెందుకు.

ప్రజలకు కావలసింది నిస్వార్థంగా పనిచేసే సమర్థులైన నాయకులు. పొంకదంపుడు వుపన్యాసాలు, వ్యర్థమైన విమర్శలు కట్టిపెట్టి సమస్యలమీద దృష్టి కేంద్రీకరించి పరిస్థితులను చక్కదిద్దగలిగితే ప్రజలు హర్షిస్తారు.

నెల్లూరు —కూరపాటి వెంకటేశ్వర్లు

### ఇదేనా సింహపురీయుల సంస్కారం?

మొన్న 18 తేది నెల్లూరు ఆర్.టి.సి. బస్‌స్టేషన్‌వద్ద బస్ దిగి ఒక మిత్రుని కోసం రోడ్డుపక్క కొంత సేపు వేచి వుండవలసివచ్చింది. అక్కడే టవున్‌బస్‌కోసం ఎంతోమంది ప్రజలు వేచివున్నారు. అందులో విద్యార్థినులుకూడా వున్నారు. కాని కొందరు యువకులు ఆ విద్యార్థినుల పట్ల ప్రదర్శించిన అసభ్యప్రవర్తన, ఆకతాయితనం, అల్లరిచూసి చాలబాధ కలిగింది. ఇదేనా నవనాగరికులనుకునే సింహపురీయుల సభ్యతా సంస్కారాలనిపించింది. ఇంత జరుగుతుంటే పోలీస్ కానిస్టేబుళ్ళు ఏమాత్రం జోక్యం కల్గించుకోలేదు.

ఎస్. పి. గారు బస్‌స్టాపులలో, ముఖ్యమైన స్థలాల్లో మఫ్టి పర్యటనలు నిర్వహించి రౌడీమూకనుండి విద్యార్థినులకు తగినరక్షణ కల్పించడం అవసరం. రోడ్ సైడ్ రోమియోలకు పోలీస్ అంటే సింహస్వప్నం గావించగలగాలి!

కలిచేడు —షేక్ మహబూబ్‌బాషా

### ఇదేమి అన్యాయం!

డిప్యూటీ సర్వేయర్ పోస్టులకు 1988 లో పరీక్షలకు పిలిచి హాలులోకి వచ్చిన తర్వాత వాయిదావేసినట్లు ప్రకటించారు. 1989 ఏప్రెల్‌లో పరీక్షలు పెట్టి మరలా ఇంటర్వ్యూలు నిర్వహిస్తామన్నారు. ఇంతవరకూ పిలవలేదు. నిరుద్యోగులతో చెలగాటమా? ఇదేమిఅన్యాయం ఇప్పటికైనా వెంటనేఇంటర్వ్యూలకుపిలిచి, ఖాళీగావున్న పోస్టులకు వెంటనే భర్తీచేయవలసిందిగా కోరుతున్నాను.

— బి. ఆంజనేయవరప్రసాద్
అధ్యక్షుడు, మండల యూత్ కాంగ్రెస్
విడవలూరు

# 24-12-1939 స్వర్ణోత్సవ అభినందనములు 24-12-1989

Sainathan & Co. Nellore
1939
50
years
1989



మా సంస్థ జనకులు
శ్రీ ప్రత్తి నరసింహులు శెట్టిగారు

ఈ 24 తేదితో మా సంస్థ జన్మించి 50 సంవత్సరములు నిండుతున్నాయి. ఈ సంతోష సమయంలో ఇంత సుదీర్ఘ కాలం మమ్ము ప్రోత్సహించి మా అభివృద్ధికి కారకులైన మా ఖాతాదారులు, మిత్రులు, శ్రేయోభిలాషులకు వినమ్రతతో కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాము.

స్వర్ణోత్సవ వేడుక 24-12-89 తేది ఆదివారం సాయంత్రం 4-15 గంటలకు నెల్లూరు రంగనాయకుల పేట శ్రీ రాఘవకళ్యాణ మండపంలో జరుగుతుంది.

PHILIPS

# సాయి నాథ్ అండ్ కంపెనీ

నెల్లూరు - ఫోన్ నం. 5078

— With Best Compliments Of —

**Hyderabad Allwyn Ltd.,**
VIJAYAWADA

*

**BABU ELECTRONICS**
NELLORE

Sri C. Venkatachalam
&
Sri C. S. Srinivasan, Advocate
Props. EGA Theatres, Madras.

*

Dr. V. Dwarakanath
M.B.B.S., M. S., MNAMS., M. Ch.
Cardiothoracic Surgeon,
Govt. General Hospital, MADRAS-3.



యాభై యేళ్ళక్రితం మాసంస్థకు సాయినాథన్ అండ్ కంపెనీగా నామకరణంచేసి, తమఆశీస్సులందజేసి దీవించిన శ్రీ షిర్డీసాయి శిష్యులు శ్రీ నరసింహస్వామీజీ వారికి, స్వర్గీయ బెజవాడ రామచంద్రారెడ్డిగారికి మా హృదయపూర్వక భక్త్యంజలి ఘటిస్తున్నాము.

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, - Nellore